REG. No. 757

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని. జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము6 } 1914 అక్టోబరు. { సంచిక 10

విషయములు.





చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the 'Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

---

### ఈనెలసొమ్ము చెల్లించిన చందాదారులు

1 గోరిపెద్ది సదాశివయ్యగారు లైసెన్సుగుమాస్తా నకరకల్లు
2 ములుకుట్ల సుబ్రహ్మణ్యముగారు స్కూలుమాష్టరు భీమవరము
3 బెల్లంకొండ నరసింహారావుగారు పమిడిపాడు
4 బెల్లంకొండ [illegible]రావుగారు పమిడిపాడు
5 పణ్యాల బుచ్చిరామయ్యగారు గుంటూరు
6 గొల్లపూడి లక్ష్మణశాస్త్రిగారుటవున్ హైస్కూలుఆంధ్రోపాధ్యాయులు బెజవాడ
7 సోమయాజుల నరసింహముగారు బెజవాడ
8 డి మోషే ఎ ఫ్ క్లాసుస్టూడెంటు పిడుగురాళ్ల
9 వుల్చిరామయ్యగారు పేరికలపూడి
10 వేలమూరి గోపాలకృష్ణయ్యగారు బెజవాడ
11 పుచ్చాసీతారామశర్మగారు పెదకొండూరు
12 భువనగిరి సోమయాజులుగారు డిస్ట్రిక్టుమున్సిఫ్ కోర్టుక్లార్కు నరసరావుపేట
13 సూరి వెంకటనరసింహముగారు ప్లీడరు బెజవాడ
14 సన్నిధానము విశ్వనాథశాస్త్రిగారు లైసెన్సుగుమాస్తా చోటపాపయపాలెము
15 పప్పు సీతాపతిగారు పిడుగురాళ్ల
16 చివుకుల శ్రీరామశర్మగారు నాగులుప్పలపాడు
17 ప్రభల వెంకటసుబ్బయ్యగారు స్పెషల్‌రివిన్యూయినస్పెక్టరుగారు సిరిపురము
18 మద్దులపల్లి గురుబ్రహ్మముగారు తాలూకాక్లార్కు నరసారావుపేట
19 వేలమూరి ఆంజనేయశాస్త్రిగారు డిటో
20 అంబడిపూడి విశ్వనాథసిద్ధాంతిగారు నందిగామ
21 కోతా పుండరీకాక్షుడుగారు జిల్లాకోర్టుప్లీడరుగుమాస్తా గుంటూరు
22 కొల్లంకి సీతారామబ్రహ్మశాస్త్రిగారు గుంటూరు

# అభినవసరస్వతి

సంపుట 6. | జానపాడు ఆనంద సం॥ ఆశ్వయుజమాసము. | సంచిక 10

## కృతివిమర్శము.

ఉమాపతివిజయము—ఇయ్యది యేటుకూరుసీతారామయ్యగారిచేవ్రాయబడిన యొకనవల-సామాన్యముగాఁ దెనుఁగుబాసనర్థముచేసికొనుచుఁ జదువనేర్చిన సకలజనులకును దెలియఁదగిన సులభశైలిలో మృదుమధురమగు రచనగలిగి యలరారుచున్నయది చక్కనిదృష్టాంతములతోను మంచినీతులతోను యుక్తులతోను నింపి చదువనారంభించిన తర్వాత సమగ్రముగఁజదివికాని విడువకుండునంతటిస్థితిలోని కీగ్రంథముం దెచ్చినకవి నవలాలేఖనసమర్థుఁడనుట నిర్వివాదాంశము-కాని యిందలివిషయముమాత్రము విచారణీయము-గ్రంథకర్త సంఘసంస్కర్తయై హిందూసంఘదోషముల వెల్లడిపఱుపనే యిదివ్రాసినట్లభిప్రాయపడుచున్నవాఁడు-హైందవులు కేవలము నిర్దోషులై విధ్యుక్తకర్మానుష్ఠానపరతనే వర్తించుచుండిరని మేము చెప్పసాహసింపముకాని యీగ్రంథకర్త దోషములని చెప్పినవిమాత్రము కొన్ని దోషములుకావని ఘంటాపథముగాఁ జెప్పఁగలము-వేదములపౌరుషేయములో పౌరుషేయములో జాతిభేదము విధిచోదితమో తద్భిన్నమో వేదశాస్త్రపరిశ్రమవేద్యముకాని యత్కించిదాంగ్లేయభాషాభ్యసనమునను సామాన్యజనమాత్రామోదక నవలారచనానుకాని త్రైలింగభాషాపాండిత్యసంపాదనమునను దెలియఁదగినదికాదు-పాశ్చాత్యవిద్యాలేశపఠనమాత్రముననే పాశ్చాత్యవేషభాషయందు బద్ధాదరులైన పండితంమన్యులు పెద్దయుపన్యాసకులై సభలకెక్కి ప్రాచీనాచారముల స్వేచ్ఛానుసరణముగఁ దమ శుష్కతర్కములచే ఖండింపదొరకొనుటయు వేదవేదాంగాది వివిధవిద్యాప్రవీణులగు విద్వచ్ఛౌండులు వివాదభీరువులై వినుకుతూహలముతో విచ్చేసిన విధేయులవోలనే తమవిద్యావ్యాపనముచేయుచుండుటయు సంఘసంస్కారము వింతగా బ్రబలుటకు ముఖ్యహేతువులైనవి-గీర్వాణవాణీనైపుణిగల సర్వంసహాసుపర్వవర్యు లెంతవఱ కభినవసరస్వతిప్రౌఢసరస్వతులుంబోలెఁ దామును దూషణభాక్కులు కావలసివచ్చుననియు నందందుఁ దమవిత్తసమార్జనవ్యాపారమునకు

విఘ్నము వాటిల్లుననియు నెవఁడేవాఁగునఁబడినమనకేమి, మనతరణోపాయమును మనము చూచుకొందమనియుఁదలంచుచు సంధ్యాసమయసముజ్జృంభమాణచంద్రశేఖరజటాజూటనిస్స్రుత స్వర్గధునీనిష్కల్మషవారఝరీసంకాశ సర్వవేదశాస్త్రమయ స్వకీయవాగ్ఝరిచే సభాస్థలముల సముపన్యసింప మొదలిడిరో యెంతవఱకు దూరాపాస్తదుర్మతధ్వాంతములగు తమ సారవదుపన్యాసభానుబింబములచే సత్యేతరమేఘావరణరహిత సద్వార్తాపత్రికాభ్రవీథిని సమలంకరింపఁజేయరో యంతవఱకు లోకోపకృతికిఁబాటుపడుచుంటిమని తలంచుచున్న లోకోపకృతిహేతుభూతులగు సంస్కర్తృబ్రువుల వాగాడంబరములు జనులఁ గలవరపెట్టకమానవు. బర్హిర్ముఖభాషాపాండిత్యము బహుప్రయాససాధ్యమైనను షడంగవేత్తలును బుధవాక్యప్రమాణపారావారపారీణులును మహామహోపాధ్యాయులును నగు శ్రీమాన్ విక్కిరాల రాఘవాచార్యులుగారిచే విలిఖితమై చెన్నపురి వసురత్నాకరముద్రాక్షరశాలలో విజయవత్సరశ్రావణపూర్ణిమయందే ముద్రాపితమై విజయముగాంచుచు 57 పుటల యొకసంస్కృతగ్రంథము వేదప్రామాణ్యమను పేరవిలసిల్లుచున్నయది కావునయనిందెప్పించి సంస్కృతభాషావిదులసాహాయ్యమున సర్వమవగాహనచేసికొని యేతద్గ్రంథకర్తృప్రముఖసంస్కర్తృస్తుతిపాఠకులు వేదముల యపౌరుషేయతం గ్రహింతురుగాక.

సాత్రాజితీయము — ఇది బుద్ధిమతీవిలాస సత్యహరిశ్చంద్రీయాది గ్రంథకర్తలగు బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారిచే రచింపఁబడిన యొక నాటకము. ప్రౌఢమును రసవత్తరమును ననుట కించుకంతయు సంశయములేదు. ఇదియేయేసమయముల ఏయేపాత్రములకేయేరసము లుచితములో యవియన్నియుం గనిపెట్టి చక్కని మృదుమధురశైలిలో వ్రాయఁబడియున్నయది కావునఁబ్రదర్శనమున కత్యంతయోగ్యమై కన్పట్టెడి. దీనివెల రు 0-14-0 వలయువారు "చంద్రికాప్రెస్, గుంటూరు" అని వ్రాయవలెను.

బాలనీతి — సికింద్రాబాదు మహబూబుకాలేజిలో నాంధ్రోపాధ్యాయులగు చివుకుల అప్పయ్యశాస్త్రిగారిచే వ్రాయఁబడినది మృదుపదభూయిష్ఠమైచక్కని సులభశైలిలో బహుకథాదృష్టాంతపూర్వకముగ వ్రాయఁబడిన యీనీతిబోధకగ్రంథము బాలురకేకాక పెద్దలకుఁగూడఁ బఠనీయమును నీతిదాయకమును ననుటకు సంశయములేదు విద్యార్థులకు వచనరచనానుకూలమై యత్యంతనీతిప్రదమైన యిట్టిగ్రంథము లిదివఱకింగ్లీషుభాషలోఁగలవుకాని తెలుఁగుబాసను గడుఁదఱచు. దీనిని స్కూళ్ళలో నాంధ్రవచనరచనాసాహాయ్యార్థమై పఠనగ్రంథముగఁ దీనికొనిన లోకోపకారముగ నుండవ

చ్చును. ఇదియే ప్రథమప్రయత్నమగుటనో యేమొ శబ్దసుష్ఠుతయందును మఱికొన్ని సందర్భములయందును యత్కించిత్ స్ఖాలిత్యములున్నను మొత్తమున కీగ్రంథ మత్యంతాదరణీయమనుట నిర్వివాదము. వెల 0-8-0 వలయువారు సికింద్రాబాదున గ్రంథకర్త పేర వ్రాసికొనవలయును.

స్త్రీవిద్యావిమర్శ.— ఇది స్త్రీల కత్యంతవిద్య యనవసరమని బోధించుచున్న యొక చిన్నగ్రంథము. అనసూయాప్రముఖభామినులు వేదాదులంగూడఁ బఠించిరి కావున స్త్రీలు సర్వశాస్త్రములం జదువను సర్వస్వాతంత్ర్యముఁ వహింపను నర్హులని వాదించెడి నవనాగరికుల యుక్తులు సప్రమాణముగా ఖండింపఁబడియున్నవి. "విద్యావిహీనః పశుః" అను నార్యోక్తిలోని పుంలింగనిర్దేశమే యీయర్థమును ధ్రువపఱచుచున్నదని దీనఁ గడుఁజక్కఁగా సమర్థింపఁబడియున్నది. "పితారక్షతి కౌమారే" త్యాది శ్లోకోదాహరణపూర్వకముగ స్త్రీస్వాతంత్ర్య మిందు ఖండితమైయున్నయది. దీని వెల 0-1-0 వలయువారు గ్రంథకర్తయగు కే. వి. శేషాద్రిశర్మగారిపేరఁ గడపకు వ్రాసికొనవలెను.

## గురుస్మృతి.

శా॥ శ్రీమన్నిర్మలబుద్ధిశాలియు విపశ్చిత్సంచయాగ్రేసరుం
డామూలాగ్రకలాబ్ధి రాముడగు వెంకయ్యాభిధానుండు నీ
భూమిం బాసి దివంబుఁ జేరనరిగెం బుణ్యంపుఁ గృష్ణాతటిన్
సామాన్యుండె కలాపురంధ్రినుదుటన్ సంధించి భూతిం గటా॥ 1

చ॥ అకటకటా! పురాతనకథార్ణవముల్ తెగవాఁగు టుత్తదో
నొకో, కలికాలమందున బుధోత్తములుండరు, జ్ఞానహీనుల్
వెకలులు వృద్ధిగాంతురని వెంకయశాస్త్రినుదాహరించె న
వ్యైకసరోజసంభవుఁడు వెట్టిపురాణభయంకరోక్తికిన్॥ 2

చ॥ వెఱకుమొ బృహస్పతి! వివేకితనిన్నెదిరింపఁడాతఁడో
సురవర! నీసుధర్మ పరిశుద్ధతగాంచెడి వేళవచ్చెనో
సరసిజసూతి! నీవు భువి జ్ఞానవిహీనుఁడవంచుఁ దేలె నీ
ధర మ్మృతిసృష్టిఁ జేసి బుధదారుణమారణ మాచరించుటన్॥ 3

ఉ॥ ఎందఱునిన్నుఁ బొందరుమహీస్థలి, నిన్నునిషొట్టనింపరిం
కెందఱు నీమహాత్మనటు లీగతి నిన్నభిమానదృష్టిచే

బొందిరటమ్మ? నీదయనపూర్వకృతాఘకదంబకంబె నిం
బొందెను గాక, యీఘనుఁడుపోయిననుంటి వెటో కలాసతీ!॥ 4

సీ॥ అకట సంస్కారవిద్యాపాటవమ్ముచే నలరుపండితుఁ డొకం డైనలేక
పండితుఁడున్నచో వానికావిద్యనుం దగినంత మంచిజ్ఞానమ్ములేక
జ్ఞానమ్ముగల్గ నవ్వానికెన్నడు కళాదానతాత్పర్య మింతయును లేక
గురుతాప్రవర్తన గరిమగల్గిన నట్లు చదువుచెప్పఁగఁ దగుశక్తిలేక
గీ॥ ఇన్నిగల్గినమహితాత్ముఁ డెవ్వఁడనుచు। నవని వెతకించి వెతకించి యనఘమూర్తి
వెంకయాఖ్యుఁ జేకొనిపోతివే? మొగంపు। వాసిదీరఁగ దేవేంద్ర! పాపివగుచు॥ 5

మ॥ మును మద్దేశికుతమ్ముఁ జంపినపుడే మోమంత వాయంగఁబె
ట్టినచీవాట్లవి యప్పుడేమఱచియుంటే యీగతిన్ సిగ్గుమా
లినజన్మమ్మిది యొందుకెత్తితివి? దుర్లాకుఘోరస్వరూ
పుని మద్దేశికుఁ గూడఁ జంపితిమృతీ! పుణ్యౌఘదూరాకృతీ!॥ 6

ఉ॥ అంబ! గతించె మద్గురుఁడు నస్మదదృష్టమిట్టులుండె, దుః
ఖంబది యెంతదోలినను గాల్గదలింపకయుండె, నీదుభా
వంబు కృపాకరంబయినఁ బాయక యయ్యనఘుండె నూఱుజ
న్మంబులకైన నన్విడక నాగురుఁడై యలరారఁ జేయుమా॥ 7

తెలికెపల్లి రామచంద్రయ్య.

శ్లో॥ సదుపచారవిధి ష్వనుబోధితాం సవినయాం సుహృదం సముపా
శ్రితాం। మమసముద్ధర బుద్ధిమిమాంప్రభో! వరగుణేన నవోఢవధూ
మివ॥

తే॥ యుష్మదుపచారముల శిక్ష నొంది సనయ
యగుచు సద్హృదయంబును నాశ్రయించి
యుండినటువంటి నాబుద్ధి కొసంగినుగుణ
ముద్ధరింపునవోఢన ట్లో మహేశ! ॥

శ్లో॥ నిత్యం యోగిమనస్సరోజదళసంచారక్షమ స్త్వత్క్రమః
శంభో! తేన కథం కఠోరయమరాడ్వక్షఃకవాటక్షతిః
అత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం హా మే మన శ్చింతయ
త్యేత ల్లోచనగోచరంకురువిభో! హస్తేన సంవాహయే ॥

చ॥ నిరతము మానిచిత్తవరనీరజమందు భవత్పదక్రమం
బరయఁ గృతాంతువక్షము మహాకఠినం బెటుతన్నఁగల్గెనో
హార! భవదంఘ్రిపల్లవము నాస్థభజించెడి మన్మనంబు, త
త్స్ఫురణము నేత్రగోచరముసల్పిన నొత్తెదఁ జేర్చి యూరుపైన్॥

శ్లో॥ ఏష్య త్యేషజనిం మనోస్యకఠినం తస్మిన్నటానీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమన స్తల్పేషు వేద్యాదిషు
ప్రాయత్సత్సు శిలాతలేషునటనం శంభో! కిమర్థంతవ ॥

మ॥ “జననంబందును వీఁడు, వీనిహృది యశ్మప్రాయ మందేఁ జరిం
తు”నటంచున్ నను రక్షసేయఁ గిరియందుం ద్వత్పదన్యాస మ
ల్లన నభ్యాసముచేసియుంటివి, అటుల్గాకున్నఁ బూపాన్పులున్
ఘనవేదీస్థలదివ్యసద్మములు నుండన్ ఱాల నర్తింతువే ॥

శ్లో॥ కంచిత్కాల ముమామహేశ! భవతః పాదారవిందార్చనైః
కంచి ద్ధ్యానసమాధిభిశ్చ నతిభిః కంచి త్కథాకర్ణనైః

కంచి త్కంచిదవేక్షణైశ్చ నుతిభిఃకంచి ద్దశామీదృశీం
యఃప్రాప్నోతిముదా త్వదర్పితమనా జీవన్ సముక్తఃఖలు ॥
ఉ॥ త్వన్నతిఁగొంతకాలము భవత్పదపూజలఁ గొంతకాలమున్
సన్నుతిఁగొంతకాలమును సత్కథలన్ మఱికొంతకాల మీ
తెన్నున యుష్మదర్పితమతి న్ముదమందెడిమానవుండు వి
ద్వన్నుతిగాంచి ముక్తుఁడగుఁ దా సశరీరముగన్ మహీస్థలిన్ ॥ 81
శ్లో॥ బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే!
ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాదిరూపందధౌ
త్వత్పాదే నయనార్పణంచకృతవాన్ త్వద్దేహభాగోహరిః
పూజ్యాత్పూజ్యతర స్సఏవ నహిచే త్కోవా తదన్యోధికః ॥
మ॥ శరభావంబు వృషత్వమర్ధతనుచే జాయాస్వరూపంబు సూ
కరభావంబు సఖిత్వమున్ వరమృదంగధ్వానకృత్త్వంబునున్
ధరియించెన్ నయనారవిందమునిచెం ద్వత్పాదమూలంబునన్
హరి యుష్మత్తనుభాగి,పూజ్యుఁ డతఁడేయా నెల్లరం జూడఁగన్॥
శ్లో॥జననమృతియుతానాం సేవయా దేవతానాం
నభవతిసుఖలేశ స్సంశయోనాస్తి తత్ర
అజని మమృతరూపం సాంబ మీశం భజంతే
యఇహపరమసౌఖ్యం తేహిధన్యా లభంతే ॥
చ॥ జనిమరణంబులందుదివి షత్తులఁగూరిచిచేయుపూజచే
తను లవమాత్రమేని సుకృతం బొడఁగూడదుగాన నెవ్వఁడై
నను జననాంతశూన్యుఁడగు నందితురంగునిసేవసేయ నిం
పెనయ సుఖాలవాలమయి యెంతయు ధన్యతగాంచు నిబ్భువిన్॥
శ్లో॥ శివ! తవపరిచర్యాసన్నిధానాయగౌర్యా
భవ! మమగుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే
సకలభువనబంధో! సచ్చిదానందసింధో!
సదయ! హృదయగేహే సర్వదా సంవసత్వం॥

చ॥ శివ! భవదంతికంబునను సేవయొనర్చుచుఁ జాలభక్తిచే
శివకనుకూలగకా మెలఁగ శ్రీఘమ సద్గుణధుర్యయైన మ
త్సవినయబుద్ధికన్యకను సమ్మదమొప్పగనిచ్చువాఁడ నీ
యువతులఁగూడి యెల్లపుడునుండుము మద్హృదగారసీమలోకా॥ 84

శ్లో॥ జలధిమథనదక్షో నైవపాతాళభేదీ
నచవనమృగయాయాం నైవలుబ్ధః ప్రవీణః
అశనకుసుమభూషావస్త్రముఖ్యాం సపర్యాం
కథయకథమహం తే కల్పయానీందుమౌళే!॥

శా॥ బాలకా వార్ధిమథింపఁజాల,మృగాయాపాండిత్యముకా లేదు,పా
తాళప్రాంతము కేగశక్తుఁడనుగాకా,తథ్యంబుగా నెట్టు లే
హాళింగూర్తును ప్రాశనాంబరమణీహారంబులిప్పట్లనో
బాలద్ధ్వాధిపమౌళి! చెప్పఁగదవే బాగౌనుపాయంబిటకా ॥ 85

శ్లో॥ పూజాద్రవ్యసమృద్ధయోవిరచితాః పూజాంకథంకుర్మహే
పక్షిత్వం నచవాకిటిత్వమపి నప్రాప్తంమయాదుర్లభం
జనేమస్తకమంఘ్రిపల్లవ ముమాజానే!నతేహంవిభో!
నజ్ఞాతంహి పితామహేన హరిణా తత్త్వేన తద్రూపిణా ॥

మ॥ నినుఁబూజింప సమస్తవస్తుచయముకా నేగూర్చుకొంటికా భవ
ద్ఘనమూర్ధాంఘ్రుల నెట్లుకాంచఁగలఁ!చక్రాంగాకృతికా సూకరే
ట్తనువుందాల్చిన బ్రహ్మకేశవులు పంతంబూని యభ్రంబు మే
దిని సాంతంబునుజొచ్చి కానరుకదా దేవాదిదేవా! శివా! ॥ 86

శ్లో॥ అశనం గరళం ఫణీ కలాపో వసనం చర్మచ వాహనం మహోక్షః
మమదాస్యసికిం కిమస్తిశంభో!తవపాదాంబుజభక్తిమేవ దేహి ॥

మ॥ హర!నీకా వేడిన నేమియీఁదలఁతో యాహా!నీవుభక్షించుట
ల్గరళం బంబర ముత్తకృత్తి సదలంకారంబు కాకోదరాల్
తురగం బుక్షము వీనినొల్లఁజుమినే దుఃఖాబ్ధికిం బోతమై
ధరఁ బ్రఖ్యాతినిగాంచు నీదు పదపద్మద్వంద్వభక్తికాఁ వినా ॥ 87

శ్లో॥ యదా కృతాంభోనిధిసేతుబంధనః కరస్థలాధఃకృతపర్వతాధిపః
భవాని తే లంఘితపద్మసంభవ స్తదాశివార్చాస్తవభావనక్షమః॥

మ॥ వనధింగట్టినరాముదూపమును గీర్వాణాగ్ర్యునాకారముఁ
ఘనవింధ్యారి యగస్త్యుతేజమును నే గాంచంగసద్భాగ్యమొం
దినఁ బూజానుతిభావనల్గని రహిం దీపించుటేకాక మే
దిని నన్నందఱుఁగొప్పఁజేసెదరు ధాత్రీభృత్సుతావల్లభా!॥ 88

శ్లో॥ నతిభిర్నుతిభి స్త్వమీశ! పూజావిధిభి ర్ధ్యానసమాధిభిర్నతుష్టః
ధనుషాముసలేన చాశ్మభిర్వా వద తేప్రీతికరం తథాకరోమి॥

క॥ నతినుతిపూజాధ్యానస్థితులంగావింపఁ దృప్తిఁజెందవునీవు
ధ్ధతముసలశిలాధనువుల నతితృప్తిఁజెందెదేని యటులొనర్తు ॥89

శ్లో॥ వచసా చరితంవదామి శంభో రహముద్యోగవిధాసుతేప్రసక్తః
మనసాకృతి మీశ్వరస్య సేవే శిరసా చైవ సదాశివంనమామి॥

క॥ భవదుద్యోగవువిధుల
శివ! యెఱుంగమి శిరమువంచి చేయుచుఁబ్రణతుల్
భవదాకృతిమనమునఁగని
తవిలిపఠించెదనునోటఁ ద్వచ్చరితంబుల్॥ 90

శ్లో॥ ఆదావిద్యా హృద్గతా నిర్గతాసీ ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం భావే ముక్తేర్భాజనం రాజమౌళే॥

ఉ॥ శంకర! నీయనుగ్రహము సాంద్రముగా ననుఁజెందినందుచే
సంకటపెట్టుచుండు మది ననాదిగనుండువిద్య నష్టమై
యంకురమందెవిద్య, యిఁక నాత్మభజించెద ముక్తిహేతువుం
బంకవిభంజకంబునగు త్వత్పదతామరసంబు భక్తిమై॥ 91

సీ॥ ఏదేవుఁజూడఁగా వేదాళిఁబఠియింతు
రధికులై బ్రాహ్మణులధికభక్తి
ఏదేవవరుఁగూర్చి యెంతయుయజ్ఞముల్
శ్రద్ధఁ జేతురు విప్రజనులు మునులు
నేదేవుఁజూతురు హృదయాబ్జపీఠిక
యోగమార్గంబున యోగిజనులు
నేదేవుకరుణచే నిందిరాధీశుండు
విశ్వంబుపాలించు విభుతగాంచు

గీ॥ నెవఁడుపుట్టించె ధాత నయ్యాశ్వరేశు
సర్వవిజ్ఞాను సాంబుని సర్వఫలదు
భవవినాశకు శివుఁ గాంచి భక్తి సురలు
సన్నుతించిరి గద్గదస్వరముతోడ ॥ 91

తే॥ అంత దివిజులఁజూచి కాలాంతకుండు
"తుష్టినొందితి మీమహాస్తుతులవలన,,
ననుచుమరలంగఁ జూచి యవ్వనజనాభ
ముఖ్యదివిజులకసియె నమోఘదఫణితి 92

సీ॥ "పరతత్త్వమననేన, పరికింప నాయందు
సృష్టియు స్థితియునుఁ జెలఁగి లయము
గను విశ్వ మింతకుఁగారణంబగునాకు
నధికుండు నిముఁడుదా నరయలేఁడు
మత్స్వరూపజ్ఞాన మది ముక్తియననొప్పు
నట్టివిజ్ఞాన మత్యధికనిష్ఠ
మోక్షైకదేశాంతమున పీతకర్మఁడై
యజ్ఞాదిక్రియలు బ్రహ్మార్పణముగ

సలిపి గతపాపుఁడై శివజ్ఞానియైన
సద్గురుని జేరి వేదాంతశాస్త్రిసమితి
శ్రవణ మొనరింపఁబోడను దత్క్షణమునందు
నన్నుఁగనువాఁడె సర్వజ్ఞుఁ డెన్నికొనఁగ॥ 93

తే॥ ఇట్టివేదాంతవిజ్ఞాన మెల్లమీకుఁ
జెప్పితిని నేనుసురలార చెప్పవలయుఁ
బాశుపతదీక్ష నొవరించు బ్రాహ్మణులకు
ననెడివేదానుశాసనం బమరఁగలదు॥ 94

కం॥ అని పరమార్థరహస్యము। వన జేక్షణముఖ్య దేవవర్గంబునకున్
వినుపించిరుద్రుఁడీశుఁడు।తనలోఁదానఁ తనిలిచెఁ దన్మయుఁడగుచున్ ॥

తే॥ అంత సురలు మునులును దేవాదిదేవు
వైభవముగాంచి యానందవార్ధిఁదేలి
శివు జగద్ధేతువుఁ గఁ గాంచి చిత్తములను
నమ్మి రామ్నాయము లె ప్రమాణములుగఁగ 96

సీ॥ సంయమీశ్వరులార! సర్వజ్ఞుఁ బరమేశు
సర్వకారణు శివు సర్వమయుని
విశ్వకారణుఁగాఁగ విశ్వసించిభజంపుఁ
డటమీఁదమీకు సోమార్ధమాళి
సాంబుండు విష్ణ్వాదిసర్వామరులుగొల్వ
సాన్నిధ్య మొసగించు, సత్యమిదియు
నని సూతుఁ డుపదేశ మొనరింపవిని నైమి
శారణ్యవాసులౌ సన్మునీంద్రు

గీ॥ లమ్మహాదేవుమాహాత్మ్య ములపాశు
పతమహాదీక్ష దెల్పినపరమగురుని
సూతుఁ బ్రణమిల్లి పూజించి జాతభక్తి
వినుతిఁ జేసిరి విజ్ఞానఘనతగోరి॥ 97

నందీశ్వరవిష్ణుసంవాదంబున నీశ్వరాధిక్యకథనము

వ॥ అంత సర్వార్థసాగరుండైన సూతునింజూచి నైమిశీయులిట్లనిరి, "దేవా! నీప్రసాదంబునఁ బరమేశ్వరుండైనశివుండే పరబ్రహ్మంబనియును జగత్కారణంబనియును దెలియంబడియె. నింక సురాసురయక్షకిన్నరగంధర్వసిద్ధసాధ్యమునీంద్రులచేత నితరజంతుసంతానంబులచేత భుక్తిముక్త్యర్థంబు సకలాభీష్టార్థంబు నుపాసింపంబడుదైవం బెవ్వఁడట్టివాని నానతీవలయు" ననిన వారలంగనుంగొని విజ్ఞానసమేతుండైన సూతుండిట్లనియె.

తే॥ "పరమమునులార! కడుమహాప్రాజ్ఞులగుట
నడిగితిరివిచారలీప్రశ్న మఖిలలోక
హితము" దీనివచింతునే శ్రుతిహితముగ
వినుఁడుమీరుశ్రద్ధచే మనసునిలిపి॥ 99

ఉ॥ మున్ను జగద్వరుండు హరిమోహితుఁడై శివమాయచేత నే
నెన్నఁగలోకకర్తను, మదీహితమీజగమేన యీశుఁడన్
బన్నగ నాదుశక్తి గుణబంధురయామ జరాచరంబులన్
గ్రన్ననఁజేయు, నన్నధికుఁగా నఖిలంబు భజించు నెంతయున్ 100

వ॥ అనుచుఁ బరబ్రహ్మంబగుశివు నెఱుఁగక

తే॥ ఇట్లహంమానయుక్తుఁడై యిందిరేశుఁ
డాత్మభూతు మహాదేవు నంబికేశు
ఘనచిదాకాశమూర్తిని గానలేక
యాజ్ఞయొనరించెఁ దానె బ్రహ్మకులకును॥ 101

కం॥ సర్వాభాసకుఁడభవుఁడు। సర్వజ్ఞుని విష్ణుదేవు శాంతగుణంబుల్
సర్వముహరియించి మహా। ఖర్వస్థితి మోహజాలకలితుని జేసెన్॥

తే॥ అంత హరిముఖ్యులగుచుబ్రహ్మాదిపశువు
లభవుమాయావశమున మోహమ్మునంది

వివశులై రింక నెవ్వఁ డవ్విభునిమాయ
మదిజయింపంగ నేర్చు నోమానులార ॥ 103

క॥ ఆసమయంబున నంది మహాసర్వజ్ఞుండు శాంభవాకృతి కరుణన్
దా సుజ్ఞానఖని పంకజాసనహరిముఖులఁజూచి యతిమధురోక్తిన్

వ॥ శివునిపరమభావం బుపదేశించి యందు విశేషించి విష్ణుదేవునిం
జూచి యిట్లనియె. 105

ఉ॥ సర్వజగద్వరేణ్య! హరి! శంకరుఁ డప్పరమేశుఁ డింతకున్
సర్వగుఁడైనసాక్షి ఘనసత్యచిదాత్మకసర్వభాసకా
ఖర్వసుఖాత్ముఁ డీప్రకృతి కల్పితజీవుల కాత్మభూతుఁ డా
శర్వప్రసాద లేశకణసల్లవలేశలవానుకూలతన్ ॥ 106

తే॥ కలిగెవిష్ణుత్వమదినీకుఁ గమలనయన !
అన్యహేతువులేదు నీ వరసిచూడు
మన్యులపదంబులును దద్దయాగతంబు
లతనికన్యంబుగా జగం బడఁగుటలేదు॥ 107

సీ॥ ధాత విధాతయూ ధన్యుఁడు విశ్వైక
వస్తుసంతతికెల్ల వనజనాభ !
అగ్నిసంగంబైన యాయసంబేరీతి
మిగులభాసిల్లు నిజగము లట్ల
యమ్మహాత్ముని తేజ మాధారముగఁ జేసి
భాసిల్లుచుండు నాబ్రహ్మమయుని
యానందవేళ లవాంశంబుగైకొని
యఖిలభూతంబు లత్యంతమైన
సంతతానంద మొందు నాసర్వగురుని
యాజ్ఞ జన్మనాశస్థితు లందుజగము
లిట్లు నినునీవెఱుంగవ యింతతడవు
మోహమొంది యహంకారమూర్తివగుచు॥ 108

తే॥ జగము మోహింపఁ జేసితి జలజనయన!
ఇంక మోహాంబు విడిచి మహేశు నభవు
స్వాత్మభూతుని భావింపు స్వాత్మయందుఁ
గానవచ్చును బరశివాకాశ మనఘ ॥ 109

కం॥ హరి! విను శివునకుఁ దనకును
బరమాణుసమాన భేదభావము గలుగన్
బరమేశ్వరాధికారము
పరఁగఁగ "నాయది" యనంగ బహుపాపము గున్ ॥ 11)

కం॥ అని నంది శంకరప్రియుఁ
డనఘుఁడు రథమెక్కి తారకాద్రికి నరిగెన్
మునివర్యులార! యంతట
వనజేక్షణముఖ్యదేవవర్గము భక్తిన్ ॥ 111

తే॥ శర్వు రుద్రు మహర్షిని సర్వసాక్షి
ఘనుని బురుషుని గృష్ణుఁ బింగళుని శివుని
బూజఁ జేసిరి యట సర్వభూతములును
బొసఁగ లక్ష్మ్యాదిశక్తులు పూన్చిరభవు॥ 112

ఉ॥ అంతట వారిముందఱ మహావృషభేంద్రము నెక్కి భక్తసు
స్వాంతవిహారి శంకరుఁడు చంద్రకళాధరుఁ డద్రికన్యకా
కాంతుఁడు దోఁచె నవ్విభుని గాంచి విరించి ముకుందులాదిగా
నెంతయు మ్రొక్కి రప్డు డమరేశులు దండనిపాతితాంగులై ॥ 103

తే॥ ఇట్లు సాక్షాత్కరించిన యీశుఁ జూచి
శిరముపై నంజలిపుటముఁ జేర్చి భక్తిఁ
బూని తన్నిశ్చలేంద్రియమానసముల
స్తుతులొనర్చిరి వేదాంతహితమృదూక్తి॥ 104

కం॥ భక్తియు ముక్తియు నొసఁగుచు। భక్తుల రక్షించునట్టి పరమేశుఁ బరా
శక్తిప్రియుఁ బశుపతి సం। రక్తిని గనుగొనుచు దివిజరాజి నుతించెన్॥

తే॥ "దేవదేవ! వేదాంతవిద్ద్విజవరేణ్య
పూజ్య! భవభీతిమర్దన! భుక్తిముక్తి
ఫలద! విశ్వసృష్టిస్థితిప్రళయకరణ!
నీలకంఠ! కృపాకర! శూలపాణి! 106

తే॥ విశ్వపతి! కృత్తివాసక! విశ్వయోని
క్ష్మాజలానలవాయుఖరాజసూర్య
స్వాత్మముఖాష్టరూపక! శర్వ! నీకు
నతులొనర్తుము ముమ్మాఱు కుతుకమునను॥ 107

వ॥ మఱియు సత్యరూపుండును సత్యరూపియు బోధరూపుండును బోధరూపియు సుఖరూపుండును సుఖరూపియుఁ బూర్ణరూపకుండును బూర్ణరూపియు బ్రహ్మరూపకుండును బ్రహ్మరూపియు జీవరూపకుండును జీవరూపియు సవ్యక్తరూపకుండును సవ్యక్తరూపియు శబ్దరూపకుండును శబ్దరూపియు స్పర్శరూపకుండును స్పర్శరూపియు రూపరూపకుండును రూపరూపియు రసరూపకుండును రసరూపియు గంధరూపకుండును గంధరూపియు దేహరూపకుండును దేహరూపియుఁ బ్రాణరూపకుండును బ్రాణరూపియు శ్రోత్రరూపకుండును శ్రోత్రరూపియుఁ ద్వక్స్వరూపకుండును ద్వక్స్వరూపియు దృష్టిరూపకుండును దృష్టిరూపియు జిహ్వారూపకుండును జిహ్వారూపియు ఘ్రాణరూపకుండును ఘ్రాణరూపియు వాక్స్వరూపకుండును వాక్స్వరూపియుఁ బాణిస్వరూపకుండును బాణిస్వరూపియుఁ బాదస్వరూపకుండును బాదస్వరూపియు లింగస్వరూపకుండును లింగస్వరూపియుఁ బాయుస్వరూపకుండును బాయుస్వరూపియుఁ జిత్తరూపకుండును జిత్తరూపియు మాతృస్వరూపకుండును మాతృస్వరూపియు మానరూపకుండును మానరూపియు మేయరూపకుండు

ను మేయరూపియు మతిరూపకుండును మతిరూపియు సర్వరూప
కుండును సర్వరూపియు నగు పరమాత్ముండ వీవయ్యె బ్రహ్మవిష్ణు
శివాత్మకుండవై మహాదేవుండవై భక్తచిత్తాంబుజాసీనుండవై ద
యాసముద్రుండవై పరబ్రహ్మంబవైన నీకనేకకోటిసాహస్రనమ
స్కారంబులాచరించెదము, మమ్ము రక్షింపు రక్షింపు" మని బ్రహ్మా
దిసురలు స్తోత్రంబులుచేసి దండప్రణామంబులాచరించి యప్పర
మేశ్వరునందు భక్తిపారంగతులై యున్న నంత దేవదేవుండును నం
బికాపతియు నగు పరమేశ్వరుండు వారలకు స్వకీయభావంబు స
మ్యగ్దర్శనంబుగావించి యానందతాండవంబాచరించి బ్రహ్మవిష్ణ్వా
దులతోడంగూడి చిదంబరాగ్రహారంబునకుఁగావున సదాశివుండు చి
దంబరంబు ప్రవేశించి యందు స్వసంకల్పకల్పితవిగ్రహుండయి శివుండు
నిరంతరంబు సంతతానందతాండవంబు సేయుచుండుఁగావున సర్వమునులు
నయ్యఖిలేశుని భుక్తిముక్తిప్రదంబగు నాట్యంబు విలోకించుటకై త
న్మహాచిదంబరం బాశ్రయించియుందురు, మీరును మహాదేవ ప్ర
సాదంబునకై భుక్తిముక్తిదుండును దయాసముద్రుండునగు నమ్మ
హాదేవుఁబూజసేయుఁ" డని సూతుండు పరమదయాసమేతుండై
యుపదేశించినవిని నైమిశీయమహామునులు పరమగురుండును నా
త్మహితప్రదుండును నగు సూతునకు మహీతలంబున దండప్ర
ణామంబులాచరించి పూజించి దేవదేవుండును నంబికాపతియును
శంకరుండును నగు శివుండే సర్వజంతువులచేత సార్వకాలంబు
నుపాస్యుండును భుక్తిముక్తిదుండును నగుదైవంబని నిస్సందేహం
బుగా నెఱింగి రంతవారివలనఁ దచ్ఛిష్యప్రశిష్యులును సర్వభూతం
బులును మహాదేవుండె సర్వపూజ్యుండని యెఱింగి పూజించుచుండి
రంతయు. 108

ఈశ్వరపూజావిధానతత్ఫలములు

తే॥ నెయ్యమున సూతునకు నైమిశియ్యమునులు
వినుతులొనరించిపలికిరి విమలభక్తి
"భుక్తిముక్తిమలొక్కండె పురహరుండు
శివుఁడటంచును దెలిసె మాచిత్తమునకు॥ 109

తే॥ నీలకంఠుండు పరముండు శూలపాణి
యగుమహాదేవుఁబూజింప నగునుభుక్తి
ముక్తులప్పూజయెనరించుయుక్తిమాకుఁ
దెలియఁగాఁజెప్పుమా సూత! ధీసమేత!"॥ 110

కం॥ అనవినిసూతుండిట్లను। "వినుఁడీపరమేశుపూజ వేదస్మృతులన్
గనవచ్చు వాని నిత్యం।బును భక్తిం జేయ భుక్తిముక్తులుగలుగున్

సీ॥ స్నానంబుచేసి విశాలదేశమునందు
గోమయాలేపితధామమునను
సమధరాస్థలి సుఖాసనమునఁగూర్చుండి
మునివృత్తియై యుదఙ్ముఖమునదనర
శుచియై విచిత్రితశుద్ధపీఠమునందు
సమ్మతి కాగ స్తోత్రశాస్త్రసరణి
సిద్ధలక్షణపూర్ణశివలింగమునునిల్పి
హృతయాంబరంబునఁ బొదలుచున్న
యమ్మహాలింగమూర్తి బాహ్యాసనస్థ
లింగమునగూర్పవలెఁ దదాలీనబుద్ధిఁ
బ్రణవమంత్రంబుచేత నీపగిదిఁజేయ
వలయు సద్గురు గురుకృపాజలముకలిమి॥ 112

క॥ వడివీవఁ జొచ్చెబోరునఁ। బడమటిగాడ్పులు మహోష్ణభరణక్రీలన్
జడనిధిసంభృతభాస్వ। ర్బడబానలశిఖలఁగలసి పఱతెంచెననన్ ॥208

తే॥ గరిమ నఖిలర్తువుల వేయికిరణములను
బూనికను సర్వజంతువితానదేహ
దాహమునకయి యవ్వేళఁ దాల్పఁజోలు
ననినకై వడి వేడిమి నినుఁడు మెఱసె॥ 209

క॥ మెండుకొనిపుండరీకోభ। వాండకరండములనిండి యతిచండంబై
యెండ వడిఁగాయఁజొచ్చె న। ఖండంబుగ నగ్ని గురియుకై వడిఁబుడమిన్॥

తే॥ వరుస సరసుల జీవనస్ఫురణమెడలె
నహరహముఁ గుందెఁ గువలయం బార్తిచేత
నినుఁడపుడు పంకజాతమ్మైలని మహోగ్ర
తేజమునమీఱ నిటులౌట నైజమొకద॥ 211

క॥ పరిలోకతాపకృద్భా। స్కరకరసాంగత్యమునకు శ్వసనాశసరా
డ్గరళాగ్నులుచను దెంచెడి। సరణులగతిఁ జిట్లుటలు రసాస్థలి నెఱసెన్॥

తే॥ భవుఁడుతగవిష్ణుపదవిష్ణుపది జటాంత
రమున నుంచుట యయ్యుష్ణశమముకొఱకె
పద్మనాభుఁడు జలరాశిభవనుఁడౌట
పరఁగనయ్యుష్ణమునకును వెఱచికాదె॥ 213

చ॥ స్తనహిమశైలముల్ ఘనభుజాబిసముల్ కచశైవలంబులున్
వినుతవళీతరంగములు నిర్మలనాభిసరోవరంబులున్
గనదధరామృతంబులు వికస్వరభాస్వరహాసచంద్రికల్
తనువులుచల్లసేయ సతులం బతులొంది సుఖించిరత్తఱిన్ ॥ 214

తే॥ సకలజనముల తృష్ణోపశాంతిసేయు
తక్రమవ్వేళఁ బానీయధామములను
బరఁగనొనరించె బహుజలపాన మింక
నితరులగు ప్రాణుల విదాహ మెన్నవశమె॥ 215

సీ॥ తొడలపైఁ జేర్చుక తోరంపుఁ బాదముల్
సిరియు భూదేవియుఁ జేరియొత్త
భాసురేందీవరప్రస్ఫురద్విగ్రహా
వరణాసంపద హరిద్వస్త్రమమర
వేత్రదండముఁబూని సూత్రవతీభర్త
యమరుల కోలాహలము నుమాన్ప
వేయిఱేకులుగల్గు వెల్లతమ్ములతోడ
హొయలుఁజూపెడు నేత్రయుగముమూసి
నిద్రఁజెందెఁ దగంగ నిర్నిద్రరత్న
ముద్రితాత్యుద్రదుగ్ధసముద్రమధ్యఁ
గాద్రవేయఘణాతల్పకంబునందు
మాధవుండు తదాషాఢమాసమునను ॥ 216

శా॥ జీమూతాఖ్యవహించె భాసురశిరస్సీమాపత సఁబుగా
జీమూతంబులువూనెఁ దద్భవనదశ్రీనాత్మఁగాంక్షించి ము
న్నామంబూనినబర్హికోటికి శరణ్యం బేర్చెదక్ వీని నే
వేమా త్రిత్తఱినన్నలీల శిఖి యుర్విధాత్రి హెచ్చింగడుక్ ॥ 217

సీ॥ శాత్రవచయసమిజ్జయఘనాభ్యుదయప్రాప్తి
నలరారి హరిసహాయత్వమొంది
కీచకహారిబలాక్షీణలీలఁజెలంగి
పున్నాగజాలవిభూతినణంచి
సుందరకాంచనస్యందనచక్రము
లుర్విపాల్చేసి మాయలనడంచి
బాణాసనశరాళి భస్మంబుగావించి
పరవీరవరుల పే రరుదుచేసి
రన్యకీలాలసద్గతి రహిందనర్చి
మేలిమిప్రతాపదీప్తుల మిన్నుముట్టి

క॥ వడిపీవఁజొచ్చెబోరున।బడమటిగాడ్పులు మహోష్ణభరణ్రశీల౯
జడనిధిసంభృతభాస్వ। ద్బడబానలశిఖలఁగలసి పఱతెంచెన౯॥208

తే॥ గరిమ నఖిలర్తువుల వేయికిరణములను
బూనికను సర్వజంతువితానదేహ
దాహమునకయి యవ్వేళఁ దాల్పఁబోలు
ననినకైవడి వేడిమి నినుఁడుమెఱసె॥ 209

క॥ మెండుకొనిపుండరీకోభ।వాండకరండములనిండి యతిచండంబై
యెండ వడిఁగాయఁజొచ్చె న।ఖండంబుగ నగ్నిగురియుకైవడిఁబుడమి౯॥

తే॥ వరుస సరసుల జీవనస్ఫురణమెడలె
నహరహముఁ గుందెఁ గువలయం బార్తిచేత
నినుఁడపుడు పంకజాతమైలని మహోగ్ర
తేజమునమీఱ నిటులౌట నైజమొకద॥ 211

క॥ పరిలోకతాపకృద్భా।స్కరకరసాంగత్యమునకు శ్వసనాశనరా
డ్గరళాగ్నులుచనుదెంచెడి।సరణులగతిఁ జిట్లుటలు రసాస్థలినెఱసె౯॥

తే॥ భవుఁడుతగవిష్ణుపదవిష్ణుపది జటాంత
రముననుంచుట యయ్యుష్ణశమముకొఱకె
పద్మనాభుఁడు జలరాశిభవనుఁడౌట
పరఁగనయ్యుష్ణమునకును వెఱచికాదె॥ 213

చ॥ స్తనహిమశైలముల్ ఘనభుజాబిసముల్ కచశైవలంబులు౯
వినుతవళీతరంగములు నిర్మలనాభిసరోవరంబులు౯
గనదధరామృతంబులు వికస్వరభాస్వరహాసచంద్రికల్
తనువులుచల్లసేయ సతులం బతులొంది సుఖించిరత్తఱి౯॥ 214

తే॥ సకలజనముల తృష్ణోపశాంతిసేయు
తక్రమవ్వేళఁ బానీయధామములను
బరఁగనొనరించె బహుజలపాన మింక
నితరులగుప్రాణుల విదాహ మెన్నవశమె॥ 215

సీ॥ తొడలపైఁ జేర్చుక తోరంపుఁ బాదముల్
సిరియు భూదేవియుఁ జేరియొత్త
భాసురేందీవరప్రస్ఫురద్విగ్రహా
వరణసంపద హారిద్వస్త్రమమర
వేత్రదండముఁ బూని సూత్రవతీభర్త
యమరుల కోలాహలము నుమాన్ప
వేయితేకులుగల్గు వెల్లతమ్మలతోడ
హారాయలుఁ జూపెడు నేత్రయుగము మూసి
నిద్రఁ జెందెఁ దగంగ నిర్నిద్రరత్న
ముద్రితాత్ముద్రదుగ్ధసముద్రమధ్యఁ
గాద్రవేయఘణాతల్పకంబునందు
మాధవుండు తదాషాఢమాసమునను॥ 216

శా॥ జీమూతాఖ్యవహించె భాసురశిరస్సీమావతంసంబుగా
జీమూతంబులు పూనెఁ దద్భవసద్రశ్రీనాత్మఁ గాంక్షించి మ
న్నామంబూనినబర్హికోటికి శరణ్యం బేర్చెదఁ బీని నే
వేమా ఉత్తవిసన్నలీల శిఖి యుర్వీధ్రాళి హెచ్చంగఁ దుఁ॥ 217

సీ॥ శాత్రవచయసమిజ్జయఘనాభ్యుదయప్రా
ప్తి నలరారి హారిసహాయత్వ మొంది
కీచకహారిబలాక్షీణలీలఁ జెలంగి
పున్నాగజాలవిభూతినణంచి
సుందరకాంచనస్యందనచక్రము
లుర్విపాల్చేసి మాయలనడంచి
బాణాసనశరాళి భస్మంబుగావించి
పరవీరవరులవే రరుదు చేసి
రన్యకీలాలసద్గతి రహిదనర్చి
మేలిమిప్రతాపదీప్తుల మిన్ను ముట్టి

సంభ్రమమున్స్ఫూర్తితో ధనంజయుఁడు మెఱసె
నొనరన వ్వేళఁదగ మహావనులయందు॥ 218

మ॥ జలతృష్ణన్ క్షితిభృద్గుహాచయములో సంతాపముంబొందుచున్
గలభద్విట్కుల మస్తదిక్కులదరన్ గర్జిల్లియార్వంగ మ
ర్త్యులకుందోఁచుఁ బ్రచండదాహమున నాయుర్వీధరాశ్యంబులు
జ్వాలశాద్రోద్ధతి నార్చెనోయనఁగ భీష్మంబైన గ్రీష్మంబునన్ ॥ 219

వ॥ ఆసమయంబున॥

క॥ పంచాగ్నిమధ్యమంబునఁ బంచాననునింగుఱించి భక్తిని భూభృ
త్పంచాస్యనందనుండు ప్రపంచము వెఱఁగంద ఘనతపంబొనరించెన్॥

శా॥ ప్రావృట్కాల మమోఘమేఘపటలీప్రత్యగ్రగజాగ్రద్యుతి
శ్రీవిద్యుద్వరపుంజసంజనితనిస్సీమాగ్రగర్జార్భటీ
భావాసహ్యపరద్విపద్విపదురుప్రారంభగంభీరఘో
షావిష్కృతజయోద్యమాద్రిబలహార్యత్తుంబుతోఁడన్ దగెన్॥ 221

చ॥ ధళధళదివ్యకాంతుల నుదారములై తగెఁ జంచలాలతల్
పెళపెళతీవ్రనాదముల భీష్మములయ్యెను మేఘఘోషముల్
గళగళనిస్స్వనంబుల జలస్థలులం గనుపట్టె భేకముల్
సలలితలీల వర్షదివసంబులయందు విచిత్రవైఖరిన్॥ 222

క॥ అభ్రమ్ముగప్పెనభ్రము లభ్రసరిజ్జూటకంఠహారిసిలతమా
లభ్రమరాంజనభూభృద్విభ్రాజదదభ్రకాంతివిభవములగుచున్ 223

సీ॥ సురసరిర్ఝురచర ద్వరహారిత్కరకర
స్ఫూర్తిరాలిన సీరుబుగ్గలనఁగ
భటులగర్జామహార్భటినుల్కి దివినుండి
తనరంగడుల్లిన తారలనఁగ
దధిమహోదధి పయోధరమాని వెడలంగఁ
గ్రక్కిన తత్ఖండగణములనఁగఁ

ప్రావృట్సమయ మహారమ్యవంశాటవి
నందుండిపడిన ముత్యంబులనఁగఁ
జంభభిద్వనపుష్పోపచయవిరాజ
దనిమిషానిమిషేక్షణాహస్త్రవారి
జాతగళదుల్లసత్పారిజాతవికచ
పుష్పములనంగఁ గరకలు భూమిబడియె॥ 224

క॥ మండితవనభృన్మదవేదండలసద్గండరీణదానము క్రియ ను
ద్దండగతివృష్టిగురిసె నఖండముగాఁ బాము ప్రేలఁగట్టినలీలన్ ॥225

సీ॥ తతబహిస్స్థలకృతాంచితతపస్సామ్రాజ్య
యతికోటి యమృతాప్తి నతిశయిల్లె
వర్ణనీయాఖిలవనకదంబంబులు
పరిపూర్ణఘనపుష్పభరములయ్యె
సురుచిరసారసాకరసమూహంబులు
స్థిరకమలోల్లసచ్ఛ్రీలఁదనరె
కమనీయసానుమత్కటకభూభాగముల్
శంబరాడంబరోజ్వలములయ్యె
సాంద్రసేతూన్నతతటాకసముదయంబు
భూరిజీవనజాతవిభూతిఁదనరె
ధరణి సేమనిచెప్పఁ దత్సమయమందు
సరవి శ్లేషార్థరతులు నైజంబెకాఁగ॥ 226

తే॥ కర్షకహలాగ్రభేదనోత్కటకఠోర
రత్నగర్భాంతరోద్వాంతనూత్నగారు
డాశ్మసంతతులనఁగ సస్యాంకురములు
నవ్యరేఖానుగతులఁ గానంగఁబడియె॥ 227

తే॥ నారదాగమవేళ స్వాంతము లిగుర్చె
సత్కదంబంబులకు ధరాస్థలమునందు

సంభ్రమస్ఫూర్తిఁ గో ధనంజయుఁడు మెఱసె
నెనరనవ్వేళఁ దగ మహావనులయందు॥ 218

మ॥ జలతృష్ణన్ క్షితిభృద్గుహాచయములో సంతాపముం బొందుచున్
గలభద్విట్కుల మస్తదిక్కులదరన్ గర్జిల్లియార్వంగ ము
ర్వ్యలకుందోఁచుఁ బ్రచండదాహమున నాయుర్వీధరాశ్యంబులు
జ్వలకాద్రోద్ధతి నార్చెనోయనఁగ భీష్మంబైన గ్రీష్మంబునన్ ॥ 219

వ॥ ఆసమయంబున॥

క॥ పంచాగ్నిమధ్యమంబునఁ బంచాననునింగుఱించి భక్తిని భూభృ
త్పంచాస్యనందనుండు ప్రపంచము వెఱఁగంద ఘనతపంబొనరించెన్ ॥

శా॥ ప్రావృట్కాల మమోఘమేఘపటలీప్రత్యగ్రగజాగ్రద్యుతి
శ్రీవిద్యుద్వరపుంజసంజనితనిస్సీమాగ్రగర్జార్భటీ
భావాసహ్యాహరద్విపద్విషదురుప్రారంభగంభీరఘో
షావిర్భూతజయోద్యమాద్రిబలహార్యక్షుంబు శోడన్ దగెన్ ॥ 221

చ॥ ధళధళదివ్యకాంతుల నుదారములైతగెఁ జంచలాలతల్
పెళపెళతీవ్రనాదముల భీష్మములయ్యెను మేఘఘోషముల్
గళగళనిస్వనంబుల జలస్థలులం గనుపట్టె భేకముల్
సలలితలీల వర్షదివసంబులయందు విచిత్రవైఖరిన్ ॥ 222

క॥ అభ్రమ్ముఁగప్పె నభ్రము లభ్రపరిజ్జూటకంఠహారిసిలతమా
లభ్రమరాంజనభూభృద్విభ్రాజదభ్రకాంతివిభవములగుచున్ 223

సీ॥ సురసరిర్ఝురచర ద్వరహారిత్కారకర
స్ఫూర్తి రాలిన నీరుబుగ్గలనఁగ
భటులగర్జామహార్భటినుల్కి దివినుండి
తనరంగఁ డుల్లిన తారలనఁగ
దధిమహోదధి పయోధరమాని వెడలంగఁ
గ్రక్కిన తక్షండగణములనఁగఁ

క్రౌంచాప్రవృత్సమయ మహారమ్యవంశాటవి
నందుండిపడిన ముత్యంబులనఁగఁ
జంభభిద్వనపుష్పోపచయవిరాజ
దనిమిషానిమిషేక్షణాహస్తవారి
జాతగళదుల్లసత్పారిజాతవికచ
పుష్పములనంగఁ గరకలు భూమిబడియె॥ 224

క॥ మండితవనభృన్మదవేదండలసద్గండరీణదానముక్రియ ను
ద్దండగతివృష్టిగురిసె నఖండముగాఁ బాము ద్రేలఁగట్టినలీలన్॥225

సీ॥ తతబహిస్థలకృతాంచితతపస్సామ్రాజ్య
యతికోటి యమ్మృతాప్తి నతిశయిల్లె
వర్ణనీయాఖిలవనకదంబంబులు
పరిపూర్ణఘనపుష్పభరములయ్యె
సురుచిరసారసాకరసమూహంబులు
స్థిరకమలోల్లసచ్ఛ్రీలఁదనరె
కమనీయసానుమత్కటకభూభాగముల్
శంబరాడంబరోజ్వలములయ్యె
సాంద్రసేతూన్నతతటాకసముదయంబు
భూరిజీవనజాతవిభూతిఁదనరె
ధరణి సేమనిచెప్పఁ దత్సమయమందు
నరవి శ్లేషార్థరతులు నైజగుబెకాఁగ॥ 226

తే॥ కర్షకహలాగ్రభేదనోత్కటకఠోర
వత్సగర్భాంతరోద్భాంతనూత్నగారు
డాశ్మసంతతులనఁగ సస్యాంకురములు
నవ్యరేఖానుగతులఁ గానంగఁబడియె॥ 227

తే॥ నారదాగమవేళ స్వాంతము లిగుర్చె
సత్కదంబంబులకు ధరాస్థలమునందు

నారదాగమువేళ స్వాంతములిగుర్చు
టలు నిజంబెకదా సత్కదంబములకు॥ 228

క॥ గురుతరపదగమ్యములై సరవిఁ నవరసగభీరశబ్దాకర్ణ
స్ఫురణల సరస్వతులుతగె స్థిరనవుడు సరస్వతీవిశేషములాదవఁ॥

ఉ॥ స్ఫారములయ్యెసస్యము లపారములయ్యెబకావళుల్, వ్యథా
ధారములయ్యెహంసము లుదారములయ్యెనదుల్, సుగంధవి
స్తారములయ్యెగేదగులు, సారములయ్యెనుశాద్వలప్రబల్
ప్రోరములయ్యెమాలతులతోఁటలు వార్షికవేళ భూస్థలిఁ॥ 230

వ॥ మఱియువర్షాకాలంబు మందీకృతనిఖిల ప్రకాశంబయ్యు నమందీకృతశిఖిప్రకాశంబై విద్యోతమానఖద్యోతప్రకరంబయ్యు నవిద్యోతమానఖద్యోతప్రకరంబై స్ఫుటనవామోదమేదురరాజీవంబయ్యు నస్ఫుటన వామోదమేదుర రాజీవంబై విభ్రాజమానాభ్రసౌందర్యంబయ్యు నవిభ్రాజమానాభ్రసౌందర్యంబై యర్జునకదంబవర్ధనంబయ్యు ధార్తరాష్ట్రకదంబవర్ధనంబై విజృంభితమహాశరంబయ్యు నఖండహరిముఖరవముఖరితదిఙ్ముఖంబై మహాహ్లాకరసదాప్రేక్షణీయ మహాత్మ్యలంబునుజీమూతన మాశ్లిష్టజీమూతంబును జీమూతవాహనహరిన్మరుత్ప్రగంపరావిరాజితంబునునై యొప్పారె. నప్పు డప్పుడమితేసిపట్టి బహిఃప్రదేశంబుల నిశ్చించలుండై తపంబుసేయుచుండె నంత॥ 231

## —♦ శరదృతువర్ణనము ♦—

క॥ ధారాధరాగమంబుఁ భూరిస్థితిగడచె, నిఖిలభువనశ్రేణి
స్ఫారానందకరములై। శారదదినములుపొసంగెఁ జారువిభూతిఁ॥

సీ॥ సానుమత్తుంగాగ్రసంస్థితవరనీల
కంఠవధూ కలగానముడిగె
కాండభృద్వేష్టితాఖండరుగ్మండల
ప్రకటవిద్యుల్లతాప్రకరమణఁగె

భవ్యనీలప్రభాభాసమానానూన
వితతఘనాఘనోన్నతిఁ బొలంగె
కూలంకషాభంగఘోషణోద్యద్భంగ
నిరుపమవాహినీగరిమ దనరె
తే॥ చిత్రనిస్తంద్రసాంద్రరుచిరప్రకీర్ణ
జంభభిత్కార్ముకాంచద్విజృంభణంబు
సమసె సంతతభాసురోత్సవములగుచు
లాలితములైన యాశరద్వేళలందు॥ 233

మ॥ అలరెన్ శారదవేళలన్ ఫలితసస్యాయాతనీడోద్భవా
వళిపింఛోద్యదభీక్ష్ణరమ్యతరశుంభత్సిద్ధసైకప్రదో
జ్వలదష్టాపదకంకణాకలితమాంచత్ప్రాంతరస్థాంచదు
త్పలగంధిజనశస్తహస్తతల విభ్రాజచ్ఛపేటార్భటుల్॥ 234

సీ॥ భంజితాంతరఖేదరంజితేందిందిర
శింజితాంచత్కుంజపుంజములను
లలితార్భకానిలచలితాగమాంత వి
గళితాసవోద్వ్యాసతలములందు
రాజితాబ్జాసనభ్రాజితాంసలహంస
కూజితోద్యత్సరిత్కూలములను
నింద్రాశ్మవైడూర్యచంద్రోపలప్రభా
సాంద్రామితోత్తుంగసౌధములను
సరసచతురవచోవిలాస రస హాసన
నవ్యపరిరంభణామోదభవ్య సద్వి
హారకేళీవినోదవిస్ఫారగతుల
సతులుపతులొప్పి రా శరత్సమయమందు॥ 235

సీ॥ జయశబ్దపూర్వకోచ్చైస్స్వనంబున మేలు
కొలుపులు వైతాళికులు వచింప

మనవులు తగఁ జెప్పుకొనవచ్చి మందిరాం
గణభూమి నిర్జరుల్ కాచియుండ
నీళాదికామినీనికురుంబములు పూర్ణ
కనకకుంభంబులు ఘనతఁదాల్ప
గార్యభారముపూను కర్తలయితలుగ
సైన్యాధినాథుఁ డెచ్చరిక నిల్వ
నిద్ర మేల్కాంచి కలశాంబునిధికుమారి
కలికిచూపులు తననేత్రకమలములకు
భవ్యశకునైకకల్యాణభరములొసఁగ
శౌరికూర్చుండె నా శరత్సమయమందు॥ 236

సీ॥ ధర రత్నగర్భయౌ టిరువంద లోనుండి
వెడలిన మగరాలవెలుఁగులనఁగ
హరిమేలుకొనుశుభాహములని నిర్జరుల్
గురిసినసురశాఖివిరులనఁగ
బహుకళాఢ్యుండైనపట్టిగన్గొని వెల్లి
విరిసినకలశాబ్ధితరఁగలనఁగ
అజుఁడు మానవులకుసృజియించినట్టి మేల్
తెలిచల్వపైఠిణీవలువలనఁగఁ
గనఁ దనర్చె సురోఘుధుక్కలహాభు గ్భ
వనజభు గ్వాతభుగ్వర వా గ్వశత్రు
రు గ్విషమదృ గ్విశదగు క్సదృ గ్విశాల
కోమలస్ఫూర్తులను తెల్లగుంపులపుడు॥ 237

క॥ పంకంబులిగిరి కన్నులు।పంకములయ్యెఁ సుగంధబంధురవికస
త్పంకేజరజఃపాళీ।సంకీర్ణములగుచుఁ బిదప శారద వేళన్॥ 238

సీ॥ ఘనసార లామజ్జక లవంగసలిలమం
తస్సీమఁ జల్లఁగాఁ ద్రావిత్రావి
బంధురసౌరభ్యపాటీరపంకంబు
లలిఁ బూపఁగాఁగాఁగ నలఁదియలఁది
మాలతీసుమమిళన్మహితతల్పంబులఁ
బూర్ణవిభ్రాంతిచేఁ బొరలిపొరలి
మధుకరశుకపికమధురకోలాహల
స్వనములు చెవిసోఁక వ్రాలివ్రాలి
భాసురమనోజ్ఞనర్మగర్భప్రశస్త
వచనరచనల జీవితేశ్వరవితతికి
బరఁగ సకియలచేఁ జెప్పిపంపిపంపి
విరహిణీలోకమొప్పు నవ్వేళయందు॥ 239

వ॥ మఱియు నా శరద్వాసరంబులు సల్లలితభిల్లహల్లకపాణీసంగతసంగీతజాతచేతోమోదవిస్ఫురద్ఘోషపాన్మిళిత లలితమలయవలయపటీరతరునికరసుకరబంధురసుగంధధురంధరమంథరగంధవహస్తనంధయపరంపరాపరికంపమానకబంధజాతసౌగంధికబృందనిష్యందమానమధురమధురసపారణపరాయణ రంగద్భృంగీసంగీతరవానుషంగ చక్రాంగరథాంగ విహంగకులకోలాహలవిరాజమాన నాళీకాకరతీరనితంబినీనితంబబింబవిడంబమాన సాంద్రచంద్రాతపసదృశాఖండపాండుర శీతలసికతాతలంబులవలనను, సికతాతలంబుల సుస్నాతులై సిద్ధాసనంబులనుండిమంత్రలయహఠరాజయోగంబు లనుష్ఠించుయోగీశ్వరులవలనను

నన్నుఁదోడ్కొనిపోయి మన్ననల్ గావించి
గూర్చెసహాయులం గొంతమంది
తానెఱింగినయట్టి ధన్యాత్ములకు నెల్ల
బోధచేసిమరల్చె బుద్ధినిందు

......నేను సంగం జాగర్లమూడి అనే గ్రామము వెళ్లినాను......ఆగ్రామములోని బ్రాహ్మణబృందమునందఱిని నొకచోటికిరప్పించి ప్రస్తుత మసుశాలలుచేయుచున్న నిందయును దానికి తాముచేయుచున్న నిశ్చయప్రయత్నమున్ను ఒకగంట వెలువడించినాడ. తమప్రయత్నమునుగూర్చి యందఱు అనేకవిధముల కొనియాడిరి......ద్రవ్యసహాయమును చేయఁబూనిరి......త్వరకాలములోనే వారొనరించెడు సహాయద్రవ్యమును తమకు పంపించెదను. యింతియేకాక యీ తేదీననే మాగ్రామములోనుండెడు బ్రాహ్మణబృందమునందఱినిచేర్చి ప్రస్తుతము తమయుద్యమమునుగూర్చి వారితో ముచ్చటించగా వారందఱు అపరిమితానందమునొంది తమయుద్యమమును కొనసాగునట్లు వేవిధముల ప్రార్థించుటయేగాక వారు తమపత్రికకు చందాదారులుగాచేరుట కియ్యకొనిరి.

దుగ్గిరాల } తాండ్ర నృసింహశాస్త్రి వ్రాలు
13-9-08 }

......చాలామంది......యేతీరునయినను ఒకపర్యాయము యీదుగ్గిరాలనువచ్చి తమ స్వరూపస్వభావమును కనుపరచి వెళ్లవలయుననిన్ని కోరుచున్నాను......యీఅయిదుగురు చందాదార్లకు గతించిన రెండుమాసముల పత్రికలున్ను కంప్లయింటునకళ్లున్ను వీ, పీ, గాపంపిస్తే వెంటనే తమచందాధనము నంపెదమని నిన్నటిదినమున మంచికలపూడిగ్రామములో నాయెదుట కంతరవేణా చెప్పినారు......తాము యెప్పుడు యీదుగ్గిరాలకు దయచేయునదిన్ని ముందుగా ఒకవుత్తరముద్వారా నాకు తెలుపవలెను......కొద్దిలో కొంతచందాధనము పోగుచేసి పంపుచున్నాను......

18-9-08 తాండ్ర నృసింహశాస్త్రి వ్రాలు

......తాండ్ర నృసింహశాస్త్రి..... ............ది 8-10-08

......యీపదిమందియొక్క చందాధనము ముందుగా తమకార్యస్థానమునకు......పంపుచున్నాను.

......మహారాజశ్రీ సంగంజాగర్లమూడి కాపురస్థులగు క్రొత్త శివలింగయ్యగారిపేర వారంరోజులక్రిందట నేను వ్రాసినవుత్తరములో పోషకులుగాగాని సహాయులుగాగాని యుండవలసినదనిన్ని యీ అభినవసరస్వతికి తమరందఱుగానుండుఁడనిన్ని వ్రాసినాను.........

సలిపెనింకను నెన్నియో సాయములను
శ్రీకరుండగు తాండ్రనృసింహశాస్త్రి
చాలనజ కభినవసరస్వతికి మున్ను
వ్యాప్తిగలిగించినటువంటి యనఘుఁ డితఁడె. 228

క॥ ఈరీతి మొదటిసంచిక, సూరిజనస్తోమమునకు స్తుతిపాత్రంబై
మీఱుచునుండఁ బ్రబోధిని, బ్రారంభము చేసె?దూఱ నత్యంతముగఁ
తే॥ ప్రబోధినితిట్లకు నవలి నెలల
*నుత్తరంబిడెనాపేప రుచితరీతి

---

? 1908 సం॥ జూన్, జులై, ప్రబోధిని,

(అభినవసరస్వతి)

అవాచ్యప్రసంగములతో నీపత్రిక యభినవముగ బుట్టినది. పురిటిలోనుండి యునాఘ్రేయములగు నశుద్ధవాసనల జిమ్ముచున్నది చెడుగవులుతో నెలకొనిన యీపసికూనను పెద్దపురిటిలోనే వెన్నెమ్మ తన్నుకబోవునేమోయని సంశయించుచున్నాము కాని తాను చెప్పరాని వాని చేపట్టినను వెన్నెమ్మ యీపసిబిడ్డ తండ్రికి పెద్దాడుపడుచట! దయదలచునని తండ్రి యూఱుచున్నాఁడు! పాలకుమాత్రము దేవులాడుకొనుచున్నాఁడు, అయినను పసిబిడ్డలపాలిటి పెనిమిత్రియగు నీవెన్నెమ్మ మిన్నకుండునా? అయ్యో! పాపము పాలులేనియీపసిబాలయెవని పాలఁబడు నోకదా! ఉగ్గుపాలతో నేగొంతుపూడ వరిగింజవేయఁగలము గాని శిశుహత్యకు వెఱచి కొన్ని దినవారములవఱకు సైరించుచున్నాము. కష్టపడి కన్నతండ్రి జాగ్రత్తతో బోషించుకొనును గాక!

* 1908 సం॥ అక్టోబరు, అభినవసరస్వతి,

అయ్యలారా! ప్రబోధినీకారుఁ డీపత్రిక 1వ సంచికపై నాక్షేపించి వ్రాసినమాట వింటిరా? పసిబిడ్డలపాలిటి పెనుమిత్రియై వెన్నెమ్మయని యొకరత యున్నదఁట! అది నెలబాలయైన యీయభినవసరస్వతిని దన్నుకొనిపోఁజూచుచున్నదఁట. ఆవెన్నెమ్మ తానుజెప్పరానివానిఁజేపట్టినను నీపసిబిడ్డతండ్రియైన నాకుఁ బెద్దాడుపడుచఁట. అందువలన దయదలచునని నేనూరుచున్నానఁట...... తాను బ్రాగ్దేశీయుఁడౌటఁ గడు నాగరికుఁడవనియు, బుద్ధిశాలిననియు, నిందలియర్థము నందఱును గనుగొనలేరనియు నిట్లు వ్రాసినాఁడు,

ఎన్నాళ్ళనుండియో తనమనసునను న్న కక్కసమంతయు వెళ్లిపోను నీయుక్క వ్రాసినాఁడు. కానిండు, చెప్పరానివానిమాట ముందుయోజింతము. జగముపుట్టఁగాఁ బుట్టి చతుర్ముఖునకిల్లాలయి సకలదేవతా పూజనీయయయిన జగన్మాతయే నిరశనవ్రతుఁడనై శరత్త్రియ మొనరించిన తపమునకు మెచ్చివచ్చి మాయింట నవతరించెఁగానివారిచిన్నదివలె నెన్నఁడెవ్వరిచే వినఁబడనిదై యొక్క వారికిమాత్రమే మాననీయయగు సామాన్యకాదు. అట్టిదానిపయికి, దన్నుకొనిపో నొకవేళ శత్రుప్రేరితయయి వెన్నెమ్మవచ్చినను గంసప్రేరితయయి భగవదవతారమయిన వెన్నునికిఁ జన్నియవచ్చినచెన్నమ్మగతియేపట్టును. ఇదియునుంగాక యభినవసరస్వతి పురిటిలోనే యవాచ్యప్రసంగములతో నశుద్ధములగుదుర్వాసనలతో బయలుదేరినదనియు నేను బాలను దేవులాడుచున్నాననియు వ్రాసిరి. మాకుఁ బదిదినములవఱకే పురుడుండుమర్యాదగాని పదిదినములు గడచి నామకరణమయినతర్వాతఁగూడ నుండునదిలేదు......ఒక చెంప నభినవసరస్వతియని యుచ్చరించుచు మరలఁ బురుడనియనుట వారిబుద్ధికౌశల్యమునకేతగు, బురిటిలోమాత్రము లోకముతోపాటు మాపిల్లలకు దుర్వాసనయుండుమాట సత్యమే. వారంటేఁ బ్రజాపతులుఁగానఁ బురిటిలోఁగూడ వారిపిల్లల కత్తురువాసనయే పెట్టుకొనిరి. ఆ ఘుమఘుమాయింపులు మాపిల్లల కెప్పటికినిరాఁదు. ఉన్నప్పటినుండి పరపురుషులువచ్చి పయినఁబడుచుందురు. ఉగ్గుబాలతోనే గొంతుపూడ వరిగింజవేయగలిగియుఁ బ్రకృతము శిశుహత్యకు వెఱచి కొన్ని దినములయినతుద స్త్రీహత్య గావింతురఁట......సాధ్యమైనచో శిశుహత్యకు వెఱవకపోవచ్చును, స్త్రీహత్యకు వెఱవకపోవచ్చును, గోహత్యకు వెఱవకపోవచ్చునుగాని, యభావమందు విరక్తిలేకున్న నెట్లు? గరుడధ్వజుఁడు కడుపునఁబడ్డదాదియే కంసుఁడు కసిమసంగి కావలసినన్ని కానిపోనిచేతలు గావించెగాని కడకుఁ గాలుపురికి గమనముకట్టుట తనపాలే యైనది......మాసరస్వతి బాలయేయగుఁగాక, రాళ్లఁబొడచినను జావులేదు. అందఱును బాలలకు బాలకయియే దేవులాడుదురుగాని పాపాల కెవ్వరును దేవులాడరు. మాపత్రికయందలి ప్రసంగములు సత్కులప్రసూతులకును రజామార్గప్రవర్తకులకును వాచ్యములుకాని నాస్తికులకు......నవాచ్యములే, పదిదినములవఱకు పాలివారినే యశుద్ధులఁజేసెడి పసిపాప నశుద్ధవాసనల జిమ్మునట కాక్షేపించినయవివేకిని మరలనాక్షేపించుటకన్న నవివేకమే లేదని యిప్పటి కింతటితో విరమింతును.

1908 సం॥ అక్టోబరు ప్రబోధిని,
(అభినవసరస్వతి)

నీతిరహితములగు తుచ్ఛప్రసంగములే ప్రధానవ్యాసములుగాగలది యీపత్రిక యొక్కటియె పల్లెనాఁటిలోఁబుట్టి ప్రబలినది. ఇందలి యసంగతప్రసంగములకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకు నించుకయయిన మాకవసరము గానుపించదు. ప్రపంచమునం దెన్నియో వార్తాపత్రికలు కలవు. అవియన్నియు నొకసంఘమునుగూర్చియో, యొకమతమునుగూర్చియో, యొకవిద్యనుగూర్చియో, యొకభాషనుగూర్చియో, యొకదేశమునుగూర్చియో, లేక యన్నిటిగూర్చియో, అభివృద్ధినిగోరి పాటుపడుచుఁ దమముఖ్యోద్దేశము ప్రధానవ్యాసములయందు వెల్లడించుచు నెట్లయినఁ బ్రజలనుద్గతికిఁదెచ్చుట స్వాభావికమైయున్నది. యీయభినవసరస్వతియో ప్రత్యేక మొకసంఘమునుదూషించుటయే ప్రధానోద్దేశముగ గానుపించుచు దుపకు గన్నుగానక దన్నుదాఁ దిట్టుకొనుచున్నది. ఇట్టియున్మత్తప్రలాపముల కొకవేళఁ బ్రత్యుత్తరమివ్వ నుద్యమించితిమేని త్రాఁగుబోతువానిఁ బలుకరించినట్లగును......మురికినీటిగుంటను కదిలించినకొలఁదిని దుర్వాసన హెచ్చుచుండును గాన నీతుచ్ఛపువ్రాతల ఖండింపఁబూనుట యనర్హగ్రంథములకుఁ బ్రబలహేతువని విడిచెదము. అనేకులు స్వకులస్థులు చివాట్లుపెట్టి సవరింపఁబూని శ్రమపడి నిరర్థకమునివిడిచిన నట్టిదానితోడ మాకేమిప్రమేయము? వారిమాటల విని బుద్ధితెచ్చుకొనిన తెచ్చుకొననిండు లేకున్న తనదుర్మార్గముననే పడియుండనిండు

ఏతద్విమర్శము.

1908 సం॥ నవంబరు డిశంబరు (అభినవసరస్వతి)

ప్రపంచమునఁ బ్రచురింపఁబడుపత్రికలు బహుజనసమ్మతములయి పలువిషయములఁ బ్రశంసించుచుండ నందుఁ బ్రబోధినిమాత్ర మొక్క కంసాలులయభివృద్ధిగోరియే వెలువడుచున్నయది...ఈప్రబోధిని వెలువడినను వెలువడకుండినను లోకమున నానాఁటికి నాగరికతబలియుచుండుటచేఁ గంసాలులు కళావంతులగుదురనుటకు మాత్ర మించుకంతయును సంశయముండదు. ఒక్క కులాధిపులు కారనియే నాయాశయము కాని తక్కినవిషయములలో "తుష్యతు దుర్జనః" అను న్యాయమున వృద్ధికివచ్చినవత్తురుగాక నూఱుకల్లలాడి యొకయిల్లుజేయుమనినరీతి విద్యామూఢులయియున్న స్వకులజుల నుద్ధరించుటకై...చేసెడి యుద్యమముమాత్రము శ్లాఘ్యతమమే.

కులాధిక్యతంగూర్చి ...... పడెడిపాటుమాత్రము చివరకు జడమునీష్వుఁడగు చంటివాఁడు చందమామనుబట్టుటకై శయములుచాచుక్రియ ననుకరింపకపోదు. శ్లో॥ “స్వగృహేపూజ్యతేమూర్ఖః”॥ అనున్యాయమున మూర్ఖుఁ డితరస్థలములలో వాఙ్మాత్రముచేనైన సంభావింపఁబడకున్నను నింటమాత్రము పెండ్లముబిడ్డల నేడ్పించుకొనితినును. అటులనే ముఖ్యవర్ణులముచ్చటించుచుండఁ హీనవర్ణులచేనైన నించుకంతపూజవడయనికమసాలులు తమలోఁదమ రోహో మీరుపెద్దలన్న మీరుపెద్దలని పరస్పర గౌరవములుసలుపుకొనుచు సంతోషపడినను నాలుగుముక్కలుచదువుకొనిమనపూర్వులు కొండమీఁదనుండి క్రిందఁబడిరనియు, మనపూర్వులు కసుపురిండ వన్నముఁదినిరనియు, మనపూర్వులు కొయ్యలు లెస్సఁ జెక్కఁగలిగిరనియు, వ్రాసికొనుచు మూర్ఖతముల మాడుభుజాలుగాఁ బొంగింపఁగలిగినను నెవ్వరిసొమ్మేమియుఁ గర్చుగాలేదు. తండ్రి కొడుకునెత్తికొనియుద్దాడునపుడు బంగారుఁపుకొండనియు, నన్నేలెడిదొరయనియు, నాపాలిటివేల్పనియు, నెన్నియోపలుకులుపలికి యాత్మను సంతృప్తిపఱచుకొనుఁగాని యాకొమరుఁడెన్నటికిని నితరులకడమాత్రము పైశబ్దములచే వాచ్యుఁడుకాఁబోఁడు. ......సీ॥ “జనియించితిమి సర్వజనవందనీయ సద్బ్రహ్మాన్వయపుఁ బయోరాశియందు” అనివ్రాసికొనుటకుసాహసించిన కమసాలి యెట్టిదుష్కృత్యమునకైన సాహసించును......బత్తులారా......అఖిలవేదశాస్త్రములను నాకాపుదిరుగవేసి యఱువదిహాయనములు పరిశోధించినను విశ్వబ్రాహ్మణశబ్దముకాని, తదర్థవాచ్యులుమీరనికాని, తద్వాచ్యులకీయధికారముకలదనికాని, తేలదు. అట్టితేల్చెడివిద్వాంసులు మీజాతినున్నవరుసను విశ్వబ్రాహ్మణపారషేయశబ్దములకు సరియైనవ్యుత్పత్తిఁజెప్పి సశాస్త్రముగ సయుక్తికముగ మీయందు సార్థకతపఱచి ముందునెలపత్రికలోఁ బ్రచురించునటులఁజేయుఁడు. ఇదియునుఁగాక పూర్వముమీరు దేవునకేమి దేవునకుం దేవుఁడగు భూదేవునకేమి భక్తులరైపతిఁజాలినకతమ్మునఁ దచ్ఛబ్దతద్భవమగు బత్తులను బ్రతీతి వడసితిరి. “పోదునువీకీర్తికాంత బొందినపిదప” అనునీతికనుగుణముగ మధ్యమధ్య మీలోఁ గొందఱు వివేకదూరులై దురహంకారమున వర్తించినను బత్తులన్నపేరుమాత్రము మాయలేదు......నిజాము దేశమందంతటను కగసాలులు బ్రాహ్మణులకుఁ బూజానమస్కారములుజరుపుచు విధేయులైయుండుట కనులారఁజూచుచున్నారము. అచ్చటియగసాలులొకబ్రాహ్మణులకేగాక శూద్రాదులకునైనను భృత్యప్రాయులై వారిచే హీనసంబోధనచేసిపిలువఁబడుచు మనుప్రసిద్ధముగమద్యపానాదిక్రియలనాచరించుచుండుట ప్ర

త్యతుము. అట్టిత్రాగుఁబోతులను నాత్మీయుల.కగ్రవర్ణులమనుచున్న,, మునియూసఁగొల్పుచు నసత్యాలాపములచేఁబత్రికనిం పెడివానివిత్రాగుఁబోతుకూఁతలోలేక నావిత్రాగుబోతుఁ కూతలో వేఱె చెప్పుకొనవలసినపనిలేదు. పత్రికలేవ్రాయ మొదలిడి పండితుఁడనని పేరు బెట్టుకొన్నవాఁడు ప్రతిపక్షులవ్రాతలు శాస్త్రీయములగుయుక్తులచే ఖండింపఁబూనుగాని, “కూఁడనురుక లేక నాచుట్టుబలాదూరు,, అన్నట్టు లిందలియసంగతప్రసంగములకుఁ బ్రత్యుత్తరమిచ్చుట మాకనవసరమని యెన్నటికిని వ్రాయఁడు. ఇందుకేకాబోలు “కసిబోనియమ్మ మసిబూసుకొనె,,నన్నసామెతపుట్టినది. శ్లో॥ “విభూషణంమౌన మపండితానాం,, అవిద్వాంసులకు మౌనధారణమే భూషణము......ఐతే ప్రబోధినియొక్క జాతిని వృద్ధికిఁదేఁ బ్రచురింపఁబడ నొకజాతిని దూషింప మాపత్రిక వెడలెననిక దాయూతఁడన్నది. కులములన్నియు నీశ్వరశంకేతితములై కలిగినవికలిగినట్లే తత్తనుచితగౌరవములనందుచుండినవిగాని మధ్య వృద్ధికిఁదేఁబడునవికావు. ఇపుడువృద్ధికి రావలసిన కులమున కిదివఱకు వృద్ధిలేనట్లేకదా. ఇకఁ గులాభివృద్ధికై నీచకులస్థులందఱు నొకపత్రికప్రచురించుకొనవలసినదే. వేదవేదాంగబోధితులేనై తాము బ్రహ్మకులసంభూతులైయున్నప్పుడు మనమిట్టివారమని యొకరికొకరు దెలుపుకొనుచుఁ బత్రికలేవ్రాయవలె. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులును, దదితరులును, తమకులాధిక్యముఁ దెలుపుకొనుచు బత్రికలుప్రచురించుచుండుటఁ గానము. అట్టిపత్రిక వైశ్యయొకటియున్నదన్న నది లోకమున నీచముగావ్యవహరింపఁబడుకులమున కుత్కృష్టతఁ దేవెడలినది మఱికాదు మూఁడవవర్ణమై యేకారణముననో జనులు లుప్తనిజధర్ములయివర్తిల్లుటచే యజనాధ్యయనదానాదులు మనకు స్మృతిసిద్ధములయియున్నవి కావునఁ దదాచరణ మర్హమని దానబోధింపఁబడుచున్నది. అట్టు లగసాలులును బ్రథమవర్ణులై ప్రప్రథమున శాస్త్రవిహితములగు సకలకర్మలును గలవారై క్షత్రియవైశ్యాదులచేఁగూడ వందితులై యున్నను మధ్యకాలమున నదియంతయు నంతరించి హీనస్థితికివచ్చినందున మరలమేము బుద్ధిమంతులమై తదున్నతస్థితికిఁదే నీపత్రికఁ బ్రకటించుచున్నారమని యన్నచో శ్లో॥ ‘సంధ్యాతిక్రమణంయస్య సప్తరాత్రమపిచ్యుతం, ఉన్మత్తదోషయుక్తో వాపునస్సంస్కారమర్హతి’ ॥ అను శౌనకోక్తి యేడుదినము లున్మత్తుఁడై సంధ్యవార్చకున్నను మగుడ నుపనయనార్హుఁడగుననియుండ నెన్ని వేలయేండ్లక్రిందనో సన్నికర్మలును నడుగంటి ప్రథమవర్ణులని యెవ్వరికిఁ దెలియబడకయుండ మరలఁ దద్బ్రహ్మత్వముఁ జాధించుకొనువాఁడు మొదట ప్రాయశ్చిత్తముచే శుద్ధులుకావలెనో యొకటివిమర్శింపవలె,

అంతఃసాక్షి ప్రత్యక్షమయ్యెవారి,

---

ఒకమనుజుఁడు తనజీవితములోఁ గొన్నిదినములు దోషియైయున్నఁ బ్రాయశ్చిత్తశుద్ధుఁడగుఁ గాని వంశములకువంశములే దోషపూరితములైయున్నఁ బ్రాయశ్చిత్తమే ధర్మశాస్త్రమందును విధింపఁబడియుండదు. దోషికిఁ బ్రాయశ్చిత్తమువినా శుద్ధిలేదు. కావున నీపత్రికమూలమున నగసాలులకుఁ గులాధిక్యమువచ్చుట గొడ్రాలికిఁ గొడుకు బుట్టుటవంటిదే కాని వేఱు కాదు. నిజమున కట్టియుత్కృష్టతవచ్చినను రావున్నను ద ద్వ్యర్ణాల ముసిఁబూసి మారేడు గాయఁజేయు నేదియో యొక యంత్రమును బన్నినవాఁడు స్వకులాధిక్యపుఁబ్రాఁతలేఁ బ్రాసికొనక మరల బ్రాహ్మణులచే రేలయుత్తవలె ఇరువర్ణముల వారును బ్రాహ్మణులగుట యసంగతమని బ్రాహ్మణులు నబ్రాహ్మణులఁ జేసినఁ గాని తాము బ్రాహ్మణులము కామనియా? సరే శాస్త్రచర్చలుంచి లోకానుభవమే మాత్రము. ఒకని గృహక్షేత్రారామాదులు మఱియొకని యనుభవములో 12 వత్సరములున్నంతనే ప్రథమునికి వానివిషయమయినహక్కు దొలఁగిపోవుచుండ వేలవత్సరములనుండి వీరి యధీనమయియున్న బ్రహ్మత్వము మరలఁదమ కేరీతిలభింపనున్నదో యోజింపుడు.... మాపత్రిక యొకసంఘమును దూషింపనే వెడలు గాఁక. ఒకసంఘమును భూషింప వెడలిన యాపత్రిక బ్రాహ్మణసంఘము నేమి సంఘకార్యమున సమర్పితసర్వస్వుఁడనైన నన్నేమి, మరల దూషింపదొరకొనుట చేటుకాలమువచ్చికాదా? ఇట్టియెడ నభినవసరస్వతితత్సంఘదూషణకై వెడలినను నొకతప్పుగాదు. ఐనను మత్పత్రిక యుక్తియుక్తముగను, శాస్త్రసమ్మతముగను, బ్రబోధినిని బూర్వపక్షముఁ జేయుచున్నది కాని...... తిట్టుటలేదు.........యెవరికులము లెవరిఁ జీవాట్లుపెట్టి సవరింపఁబూనివిడిచినది గుంటూరువాణీప్రెస్సులోఁ బ్రచురింపించిన తగాదా నోటీసులుసంపాదించిచూచినవారికిఁ దెలియఁగలదు.

---

? 1908 సం॥ అక్టోబరు ప్రబోధిని,

కామాక్షి

(అభయవచనములు)

మద్భక్తిశీలురగు విశ్వబ్రాహ్మణులారా! అభయవిహితములగు మదుక్తు లాలకింపుఁ డాలకింపుఁడు!! మీసంస్కారణోద్రేక మభివృద్ధిసేయుదును! మీయుత్సాహాలఁ బెనుపుఁడు! మీయుద్దేశముల నేకీభవింపుఁడు!

మీ యవ్యాజ కులభక్తి నపారముగ నొనర్పుఁడు! మీవిద్యాతేజస్సులఁ దేజరిల్లఁజేయుఁడు! మీవిముఖులను భీతిలకుఁడు! మీకపటసుముఖులతోఁ గలియకుఁడు! ప్రస్తుతము మీసంఘమునందుఁ గొందఱికొంత మనస్తాప ముదయమైనది. అందులో దాని నగ్గలపఱచి మొగ్గరమునకుఁ దే నూహించుచున్నారు. ఈయుద్దేశము వలదువలదు. ఎవ్వఁడో యొకమూర్ఖుఁడు త్రాగుబోతుమాటలతో నోటికివచ్చినట్లు విచ్చలవిడిఁగూసినంతమాత్రమున మీకు హెచ్చుదగ్గునా? మీకులాధిక్యత కొలఁదియగునా? కించిద్గుణాగుణమెఱింగినసభ్యులెవ్వరును మిమ్మనాదరణసేయరు, ఆబాలిశాధము గౌరవింపరు. అతఁ డాక్షేపించినకొలఁది మీయంతరంగములఁ బ్రజ్వలింపుఁడు. అతఁ డధికప్రసంగముల కాలవాలము. అతఁ డున్మాదుఁడై కన్నుగానక తన్నుఁదాఁ దిట్టుకొనుచున్నాఁడు; క్రొత్తబిచ్చగాడనని కొట్టుకొనుచున్నాఁడు. జాతినీతిలేని యామాటలను భీతిపడి యాతని కదలించుట భావ్యమా? దురభిమాను లెవ్వరో వానిమాటలువినియు, వానిచేష్టలుచూచియు, సంతసించి మేనువెంచి మనశ్చంచలురై తిరుగుచుండినమాత్రమున మీకేమితొందర? వాఁడెన్నియో వేషములు వేయఁగలఁడు, వేసినయన్నిటిని తెలిసి యూరుకొనుఁడు! ఇటీవల నామూర్ఖుఁడు గూఢాకారంబున మీసంఘకార్యస్థానమునకు రాలేదా? వచ్చి తనపేరు వెల్లఁబెట్టెనా? లేదులేదు. మాఱుపేరు పెట్టికొని తన యనామకత్వమే స్థిరపఱచెఁగదా! నామకుల కనామకునితోఁ బనియేమి? మీరభివృద్ధికి వచ్చుట యాతనికులమున కనర్థదాయకమఁట! మీశోభ యతనికి రోగమఁట! వేయేల మీరెంతవైభవముతో విఱ్ఱవీగెదరో, అతఁ డంత కండ్లనుఁ గంపగొట్టుకొనునట! మీరు మనఃపూర్వకముగ శత్రుత్వముఁదీర్చుకొనఁగోరితిరేని విద్యాసంపదఁ బూర్వరీతి నభివృద్ధిసేయుఁడు. ఓర్వలేక కుళ్లికుళ్లి యతఁ డంతటితో నశించును, సత్యముగ నామాట నమ్ముఁడు! సంశయింపకుఁడు!! ధీరస్వాంతులుకండు!!!

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.
2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహాదరు జమీందారుగారు గంపలగూడెం
3 శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరిస్వాములవారు.

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహాదరు జమీందారులు, నూజివీడు.
2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి
3 రామసింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల
4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు
5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు
6 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు.
2 నందూరు నరసింహారావుగారు, కరణం, నందూరు.
3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి.
4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.
5 పరాంకుశరావు దేశముఖుగారు, యాండారం.
6 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు.
7 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.
8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.
9 కొండపల్లి అనంతరామయ్యగారు, వకీలు, జానగాం.
10 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.
11 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.
12 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
13 వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.
14 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
15 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కాట్బ్రదర్సు, ఏజంటు.
16 దెందుకూరి బ్రహ్మానందీక్షితులుగారు గుంటూరు.